# పీఠిక.

ఈ చిన్నపొత్తము రచియించిన కవి కేశవపట్నం నరసయ్యగారు. వీరు నల్లగొండ జిల్లాలో చేరినరామన్నపేట వాస్తవ్యులు. వైష్ణవభక్తాగ్రేసరులు. తమశతకము జీడికంటి శ్రీరాములకు అంకితమిచ్చి యున్నారు. ఇమ్మహాక్షేత్రమును గురించి యెల్లరకు దెలిసిన విషయంబగుటచే యిచ్చట నుదహరించు టనవసరము. ఇక్కవి "వానకొండ శతకము." నిరోష్ఠ్యముగ రచియించి యున్నారు. పాఠకమహాశయుల యాదరమున్నచో త్వరలో వెలువడును.

కవిత్వము గురించి ఇచటనొక్కింత విశదీకరించుట సమంజసము. అంత్యప్రాస "క" నుండి యారంభము జేసి "ళ" వఱకు గూర్చుటచే సమయానుకూలముగ వచ్చుటచ్చుట గ్రామ్యాన్యదేశీయ పదములకూడా నుపయోగించినారు. గ్రంథమాద్యాంతము వఱకు భక్తిరసముచే యొప్పారుచున్నది. ఇట్టిసులభశైలిగలశతకము నాల్గవతరగతిబాలురకుపఠనీయగ్రంథముగా నియమించగలరని భాషాపోషకులగు సర్కారువారిని, భాషాభిమానులగు ఉపాధ్యాయులను సవినయముగా ప్రార్థించుచున్నాను, ఈ గ్రంథము భాషానిలయముకిచ్చిన శేషపట్నం నర్సయ్యగారు ముద్రణకొరకు ప్రోత్సాహపెట్టి వ్యయసహాయము చేసిన భాషాభిమానులగు శ్రీ [illegible]గంగుల గాయిరెడ్డి ఉపాధ్యాయులు మిక్కిలి ప్రశంసనీయులు. [illegible] మూలకు [illegible] కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాను.

గ్రంథాలయమునకు లభించిన రెండు ప్రతులయందు [illegible] [illegible]ండుగాగలవు. సాధ్యమగు నంతవఱకు సవరించితిని. ఇతరదోషము[illegible]లుండినచో పండిత మహాశయులు దెలుపఁ బ్రార్థితులు.

ఈ అముద్రిత గ్రంథరాజమును ప్రథమకుసుమముగా ప్రకటింపబడినది. కొలది రోజులలో "కొలనుపాక మహాత్మ్యము"ను ద్వితీయ పుష్పముగా ప్రకటించుచున్నాము. భాషాభిమానులగు వారు తగుప్రోత్సాహమొసంగ ప్రార్థితులు.

బహిరామియా గ్రంథాలయము.
కొలనుపాక (నల్లగొండ)
1—2—34

ఇట్లు విన్నవించు భాషాసేవకుడు.
గంగరాజు రఘునాథరావు,
కార్యదర్శి.



ఓం.

అవిఘ్నమస్తు.

# జీడికంటి రామ శతకము.

సీ॥ శ్రీరామ రామని జ్ఞ సేవింతు తొల్లింటి నేటి నేరముల మన్నింపుమంటి ।
ఏకాకినై ప్రోతె లోకాళినన్నింటి । నతిజేతు గావవే నన్ను నంటి ।
అనిలో ప్రతాపమేమని జెప్పనీవింటి । తతీబాణముల విచిత్రంబు
పొంటి । మునుమున్నె నిను గొల్చి ఘనుడయ్యె ముక్కంటి । ధరమిం.
చెసిరి విపదంబులంటి । ఘనదయాంబుధి వంచునిక్కముగ వింటి ।
గావబూనెదవేని మేల్గంటిమంటి । సిరులకిరువైనజంటి శ్రీ జీడికంటి
ధామ సుగుణాభిరామ శ్రీరామరామ.

౧. బరిమార్చితౌర నీశర జాలమునలంకగల ఘోరదుష్ట రక్కసులవంక
రామనిన్నెన్న నేరగ జాలడొగంక మొదలగు ఘనులైనతుదను శంక ।
రుండైనను వో నెరుంగజాలు నెపుంక । నిత్య నిరాకార నిష్కళంక ।
వందితాశేషగోవింద శ్రీవత్సాంక బాపవే నాదు బాపంపు శంక ।
ఎగ్గుజేసియు శరణన్న నేలు దింక । ఘనదయానిధి వీవనియనుటబొంక ।
సిరులకిలువైనజంటి శ్రీజీడికంటి । ధామసుగుణాభిరామ శ్రీరామరామ.

8. కాదుపొమ్మనకిక లేదు వేఱొకదిక్కు । అయ్యయోనన్ను జేకయ్య
టక్కు । లోకమాతవు దగులోగిలినియక్కు । నుడివించునన్ను నిన్న
డుగడక్కు । అమితమహౌఘంబు లాచరించితి పెక్కు । నేడుజొచ్చితి
బ్రోవు నీమరుక్కు । సనకాదిమునితతి సాగిని క్రెమొక్కు । తమ
కర్పితంబైన తపముదక్కు । నోటనుతిజేయ లేనింత బొప్పుడక్కు ।
ఔరవిధికెన్నరాదు నీదైనటక్కు॥ సిరుల॥

9. రోగాతురుడను వేఱొండుమార్గమెఱుంగ । తముగొల్వజాల నేమ
ముజెలంగ । పేరైనదల్వయోపిక లేదు చదువంగ । మూర్ఖచిత్తుడ
కడు మోహానాంగ । మొఱచెవిజేర్చు నిన్ మ్రొక్కితిసాష్టాంగ ।
రక్షించవే ఖగరాడ్తురంగ । రాముయెన్నడులేని రద్దినిన్ జేరంగ ।
శోచెనను గూర్చి హేతువగనంగ । కాదనెదవేని నేలరోగముదాలంగ ।
దయ్యయొ మ్రొక్కి వేసారితయ్యరంగ॥ సిరుల॥

10. నిన్నెఱింగి నుతించనేర్చినాతడె యోగి । ఆద్రిరాతమరి పాన్నాదిభోగి ।
అలసదాశివుడు నియాశక్తి గోరెడిజోగి । లీలనిన్నెఱిగి తే లేదునేగి ।
కడుగొల్చునిన్ను నారదుడు వింతబైరాగి । తనవీణెతో తనంతటనె
మ్రోగి । విడజాలడెపుడు నిన్ విగతదుర్భవరోగి । కామాదివైరుల
కడకురాగి । నిఖిలదేవత తతిగొల్చు నీవలోగి । యుండజేయవె నన్ను
నియండడాగి॥ సిరుల॥

11. ఏలుకోనివాడ నేలజేసెదజాగు । కాదనిటీకిందు కరుణబాగు । యీవుగావ
నిన వీడెవని మాటునకేగు । దొడ్డపాతకమున దొప్పదోగు । తప్పు
లెన్నైననిన్ దలచినంతటడాగు । ఇంపునికెపుడు యోగంపుతోగు
దుష్టులపాలిదుర్దోషముల్ చెలరేగు । తుదకుయింతనరాక న
మూగు । అతిదయానిధివీవని శ్రుతులు మ్రోగు । కల్లగాదింత నీకీ
కడలసాగు॥ సిరుల॥

12 తగదాసజనులబ్రోవగ గాంచితౌజగ్గు । అసురాళిజేసితౌ కారనగ్గు ।
అలరమాదేవి నాహాజేసితివెసిగ్గు । నేడె నీదయగలవాడె గ్గు । ఎంచ
ను మ్రొక్కాద మించజేసినఎగ్గు । లోకంబునీమాయలోన మొగ్గు ।
సుచరితనిజాడ జూడగానగులగ్గు అపత్సభా బాపుమయ్యరుగ్గు ।
అమితనినుతిలేమి కెందైనతగ్గు । గాదవానిని వైరివర్గంబులగ్గు॥ సిరు॥

13. ఎట్లయిన నగుచుండు నీదైననీయిచ్చ । ఇంపునీశాల్యంగరంపుపచ్చ ।
నిజమారహాస్యార్థనిబిడంపు నిరచ్చ । పాలతిసర్వంబునఁ బోలుమచ్చ ।
ముత్తడౌనినుగొల్పి ముల్లోకములు మెచ్చ । పాతకాధిపుడైన పాలు
హెచ్చ । పాలించునన్ను నీ పైభక్తి కడురెచ్చ । ఆర్తి జెందక జేయ
కయ్యనెచ్చ । భరమునీదంటి భవములవారబుచ్చ । మెచ్చునీదయ కేవ
రేమి హెచ్చుతచ్చ॥ సిరుల॥

14. మచ్చుజల్లితివేమొ మహిమీద మంత్రించి తెలియదెవ్వరికి నీ తెలుపు
మించి । లీలకోదండంచట వాలినెందుకా పొంచి లలిబ్రోవు పాప
జాలములజించి । ముఱిపించు నీమాయ ముల్లోకములముంచి సకల
విశ్వము నీఖజానసంచి । సుగలబ్రోచితె రక్కసుల చిత్రగతిద్రుంచి
నినుగొల్చిమనుట లన్నిటికిమించి । చాలనినుదల్పమికి తనువేలపెంచి ।
ముంచు నీ పేరుఘనభవములనుదంచి । సిరుల॥

15. యాచించినాడఁ పేరాసతో చెయిజాచి వానికెక్కిన దాతవంచుదోచి ।
పూని నిన్ బొగడగా లేనివారలజూచి అసియాడనివను మాయా
పిశాచి । హాటకద్యుతి నీకిరీటరత్నమరీచి నిత్యసూరులుమదినీకలాచి ।
ఘదరిజే లేదొండు తుదకునీతో పూచి తారీఫుతమ మహోత్తరపుకూచి ।
దండమర్పింతు బ్రోవు నాతప్పుదాచి । నిన్నెఱింగితె మేలు మున్ము
న్నెనోచి । సిరుల॥

16. కడునిన్ను మోహించి విడవొకప్పుడు లచ్చి ఎపుడు నీపెంపు పేరెల్ల
మెచ్చి । పరమపావనము నీప్రఖ్యాతములు దచ్చికడలందునిండె బ
ల్యాంతులెచ్చి । తఱుముదుఃఖముల నీతలపులోపటజొచ్చినంతటదీరు
మోహంపుపిచ్చి । అసురాధములు పుణ్యులైరి నీచేలచ్చి అలరమేల్
నీవ రయమైనయిచ్చి । వెతలుదెచ్చును కామసంతతులురెచ్చి । ప్రణతు
లౌనరింతునిదె ప్రదక్షిణమువచ్చి । సిరుల॥

17. రామ బ్రెముక్కెద నపరాధమింక క్షమించు నమ్మితి నేను సొమ్మటంచు ।
నెన్న నాకొండుదిక్కున్న దేమొతలంచు రక్షించు లేకనిరాకరించు ।
నెటులైననీవెయెన్నటికైనమోదించు మదినెంతు భక్తాభిమానివంచు ।
సదయ నాకెపుడు నీపదభక్తిగీలించు దీనశరణ్య దుర్దశహరించు ।
మహితదయ లేమికె మాయమించు । అజహరాదులకైన మోహమున
ముంచు । సిరుల॥

18. తుర్త నీపేరు భక్తులసంతతమునుగాచు వెనురక్కసులకది వెద్దక్కెచు ।
ఘనుడువిధాత నిన్ జ్ఞానదృష్టినిజూచు అద్దిరా నీ డేరపెద్ద తాచు । చిద
చిదీశుడవు నీచిత్ర మెవరికిదోచు మెప్పించ నేర నాతప్పు దాచు । పర
మార్గమై నీకృపావీచికల్ వీచు అతిభక్తిముక్తి ఊయ్యాలలూచు ।
నీకమలయాజ్ఞ సకలలోకాల బ్రోచు । మనుజతతిపాల దుష్టకర్మంబు
తేచు । సిరుల॥

19. భూరేణువులనైనవూని ఎన్నగవచ్చు గాని నీకథల నిక్కముగ మచ్చు।
నైన లెక్కించశక్యముగాదు బల్ హెచ్చు నీలీలనుతి మంచిమేలు
వెచ్చు । నిగమంబులెల్ల నీనిలువుదయకే మెచ్చు దాన నెవ్వరికిని తలపు
హెచ్చు । అదిలేక నేకదా అఖిలపాపము వెచ్చు ప్రార్థింతు నేర
ముల్ బారబుచ్చు । దిద్ద నిలువదు మనసు దే వెద్దచిచ్చు । అయిన
నీకృపలేమి కెందైన తచ్చు । సిరుల॥

20. మునితతి యేమిటి ఘనతపంబొనరించె దాత తానెట్లు వేదమురచించె ।
గ్రహరాజు తానెందు ఘనుడై ప్రకాశించె సురవరుం డేదానకరము
నుంచె । సనకసాదులను నేజాడ సిద్ధివహించె శివుడైన యెట్లు ప్రసిద్ధి
గాంచె । కమలావధూటి లోకము నెట్లు పాలించె నిఖిల మేహేతువ
నిర్వహించె । కారణము లేని తమకటాక్షంబునుంచె । గాక నొండేమి
లేదు సాక్షాత్కరించె । సిరుల॥

21. కమలామనఃఖేల విమలపదాంభోజ హాటకాంబర రవికోటితేజ ।
రఘుకులాంబుధిసోమ రామమహారాజ కరుణాంబునిధి భక్తకల్ప
భూజ । ఆగమాంతవిహార యఖిలకారణబీజ హరుడైతె జేయు నీ
న్నెటేగిపూజ । తరియించుటకు తాముదక్క లేదేయోజ జూడ నేరిక
గన లేడువాజ । నిగమములు జేయు నీపంత నిలచి బాజ । పెంపు దీపించె
నీకరుణ పెద్దకోజ । సిరుల॥

22. విధినిఁ జేసితివి ఈవిశ్వంబునకు ఖాజి ఘనకాంతి నీతురంగంపు ఫుంజి ।
పవననందనుఁడు నీ బంట్రౌతు బల్ తాజి సురలఁ జేసితివి గా సర్ఫరాజి ।
సారది నిన్నని మ్రొక్కె శుకుఁడు బల్ బావాజి పరిచితౌ మునులనంద
ఱీపరాజి । అలమహాదేవి నీకలదు మేల్ జవ్వాజి దనుజులు నీ బాణ
తతికి భాజి । మొండె నిను దెలియ డల రావణుండు ఫాజి । మ్రొక్కె
దనుఁ జేయు నా పాపములను మాజి । సిరుల॥

23. బందగీ శ్రీరామచందర్ మహారాజు పావననీబంటు బిల్ ఫరేజు । దయ
నేలువా వేదతమరిదస్తావేజు వస్తుజేనాన ముద్దత్ దరాజు । అభయ
మిచ్చుటకుఁ జెయ్యాకు బేరుతజువీజు కరము నీసరి లేదు కౌర్యసాజు ।
తత్త్వజ్ఞుడై తెనినుదలచు హార్ హమ్రోజు పాలింతువే భువిబల్ సహేజు ।
తెర్లుజేయకు మ్రొక్కెద దిల్ మిజాజు । దలతు నీ పేరు భవరోగ
ములకిలాజు । సిరుల॥

24. మెచ్చి తా నేఁజూచు లచ్చి నిన్ క్రేగంట జోఁడు నీకింక భువి లేడు
దంట భవమెడబాపు నీ బాటుబంటుకుబంట మ్రొక్కెద నిన్ను రో
జొక్కగంట। గావింతె లంక రక్కసుల పీనుగుపెంట సరెనని మెచ్చిం
చసురలు మింట। కాదుసుమా బొంకు లేదు నీకొకతంట భక్తులకొసఁగె
నీ ముక్తిపంట । మెలగువా రౌర ఇహపరంబులను రెంట । వేడుకొను
నిన్ను మ్రొక్కెద వెంటవెంట । సిరుల॥

25. నిగమంబులేని వర్ణించలేవనుచోట నే నుతించెదనను టేటి మాట। నిస్త్రా
తుకముగనన్ గరుణించ మనినోట మ్రొక్కబెట్టినాఁడ సుందరకిరీట ।
ఎడలేక కీర్తింతు నోడయ నిన్నేపూట నీకథలన్ని జనులు తేట ।
నీభక్తహృదయాళి నీకు పువ్వులతోట మిగులఫలంబు నీమీఁది పాట ।
అఖిలబ్రహ్మాండమంత శ్రీకైనపీట। దండమర్పింతు నిదిగొ రత్నాలమూట।
సిరుల ॥

26. భువనాల సవరించితివిగదా నీపాట్ల నీళ్ళపై నిలిపితౌ తాళ్ళకట్ట । స్రష్టా
ననిపట్టి సృష్టించుటకుదిట్ట కాదని గుఱ్ఱంబు గరుడపిట్ట । పవళించె
దేమో పెన్ పాముపై భయపెట్ట కప్పితే మంచి బంగారుబట్ట । ఉప
నిషత్తుల మర్మమెప్పనీ తలచుట్ట భళిర నీపడతి సంపదల పుట్ట । మించు
నినుగొల్వ యెవడైన మిన్నుముట్ట । చెల్లునా వేరకథలింక చెవునబెట్ట
సిరుల ॥

27. రాఘవా నీళ్ళపై తాళ్ళు చక్కగనాటి ఘనవిశాలంబైన కడలిదాటి ।
నీలరంజిలగ పెన్ కోతిమూకలతోటి లాగిచేయించి తాలంకలూటి ।
లేదు లేదిక నెందు లేరు నీతో సాటి కడవింత తమసాయకములనూటి।
సురలెన్న రావణాసురుని తలల్ మీటి చంపి చేసితె విభీషణుని మేటి।
సుంత నిన్నెన్ననైన నేనెంతపాటి నుతులు జేజాల నతులుంతుమదిని
కోటి । సిరుల ॥

33. కుబ్జనీకేపాటి గొప్పనజరుబెట్టె సేవయహల్యేమి జేసెనట్టె । వేమా
రాయశోదేమి నోముచేపట్టె యూసరవెల్లేమి జేసిపుట్టె । ఉడుతని
కైజేయు పాడుగంత పాడకట్టె తమవిభీషణుడెంత తలచిపుట్టె ।
శబరిజేసినదేమి శౌరినిమదిదట్టె తగమికి వీడేమి మిగులదిట్టె । దయ
యునేడేమో పక్షపాతంబుగొట్టె కటకటాయెందు జనువాడగతు
లుగిట్టె । సిరుల ॥

34. గొడుగుగాయెత్తి తొకొనవ్రేలితో కొండ భుజపరాక్రమ కృపాపూర
పండ । నయమెఱింగితె నీదు నామమేకలకండ వేదజాలను దయా
జూడునిండ । అంజలిమోడ్తు నీకసమానకోదండ రామపరంబు నిర
చ్చుబండ । మఱగినన్నసదుర్మద దుష్టులను దండధరుడువేయించు దుస్త
రపుబొండ । దగిలినుడిగొంటి ఘోరపాతకముయండ నన్నుమనజే
యు తమచరణంబులండ॥ సిరుల॥

35. నిన్నెఱింగినుతించ నేరమంటిమిచెడ్డ శుకమునివినుత యేలకలదొడ్డ ।
అలరుసిగ్గని పాల్కడలకడపటిబిడ్డ । తమకథల్మొలురత్నాలగడ్డ ।
బత్తారుతమరికి బంగారుశాలుడ్డ చుక్కలతెఱవునెక్కగడ్డ । జేను
నీయెడనాడు చిత్తమునకసడ్డ బంటునైతమరి పాలింటబడ్డ లేశ
మేనియు నీకెంతలేదుసడ్డ అధికదయశాలివంచు నేనాశపడ్డ॥సిరుల॥

36. జూపిరక్షింపవే నీపాదములనీడ వింతనిన్నోల్వ నేనెంతవాడ । తూ
గలేరెవరు నీతోనిల్చిపోరాడ తగునీవినీదు రత్నాలమేడ । సిరియేయె
ఱుంగు దుస్తరమైన నీజాడతీరముగా తరమెనిన్నేరిచూడ । ఘనులెల్ల
నినుమున్నె గనిరిమేల్పవమూడ । యొదయనీవాడనే నొఱులవేడ
తడవుదొలగించు మిడుముల కరుణతోడ । మ్రొక్కులిడుచుండెదను
నేలపెక్కులాడ॥ సిరుల॥

37. ఏరికైననుకోమ మేరదూబరతిండి లేశమైననువిడదాశమెండి । నడనీదు
నినుజూడ నడుముదొంగలగండి మనసునీకథలింత వినదుతొండి । తమ
నుమిన్నకమదిన్ దలచువాడేదండి యెన్ననాదశదిశలెల్ల నిండి ।
కరమర్ధిమించు నీచరితమేలుపసిండి । దురితసంకలితు లీధరమచండి ।
వైనతేయుండు నిమసవారిబండి నీమ్రొక్కెద రక్షించు నేటినుండి
సిరుల॥

38. పంపితివౌలంకపైకి కోతులదాడి చాలవర్ధిల్లె విభీషణుడువేడి । నీభ్గైరా
వణుడని నీచేతలల్వ్రేడి మడిసెనీచేత నేమాయ లేడి । నినుగొల్తు రా
మహా నీయులందఱుగూడి సదయనిన్నని మ్రొక్క దిదియేపాడి । గలు
వంగరాదేరికని మించినిమోడి దిక్కుదాసునకు వేల్పొక్కడేడి। మఱు
గుజొచ్చితి రోగధర్మములకోడి । కరుణబ్రోచుట దేవరబిఱుదువాడి॥
సిరుల॥

39. కొలువుంచితివి మంచిగొప్పకోతులదండు చావుకేకొనె పగరావ
ణుండు ।నాతిగాజేసితే నాడుతాతిదిగుండు మదిరిలోకములు నీమక్షి
నుండు । మౌనకనినుగొల్పు మనమునమునిపిండు ప్రకటమై వారి
కోరికలబండు । నిజముచేతనకోటి నీదెసౌహైమ్మెయుండు రామనీద
గుపరాక్రంబు మెండు । యొడయ నీదయపాపంబు కడలియెండు,
దలపలేదెందు నీకంటె దాతయొండు॥ సిరుల॥

40. నినుమదిగీర్తింతు నిండనమ్మ పజూడు ధరలేదునీకంటె దంశిడేడు ।
ఎల్లదీనులనెంతో యేలితివలనాడు లీలనీబిఱుదెంత్కనేడు. కడువేడ్క
నిను నారదుడువింతగొనియాడు పరమెఱుగును నిన్నుమఱుగువాడు ।
నీకథల్గలచోటనిజము లేదె మేలొనగూడు. నీదయగలవానికేది కీడు ।
మేలునీదయ తేకేవడు గోలుకోడు । వీక నీచరణంబు లేనాతతోడు॥
సిరుల॥

41. బ్రహ్మపుట్టిల్లు నీపడసితామరబొడ్డు వేడినిన్నెఱుగని వాడుగొడ్డు ।
నిఖిలలోకములలో నీమంత్రమే హెడ్డు మిత్తిపాలిటికది నెత్తిదు
డ్డు । ఘనమైననీమాయ గడవరావదిగడ్డు భక్తులకెల్ల పాపమ్ముమ
డ్డు రామయింతంతనరాదన్న నీదొడ్డు బాపుమాయయ్యనా భవపుజిడ్డ
రచ్చనీజాడభేదించ రానియొడ్డు । చెదిటీజొచ్చితి మ్రొక్కెమొఱ
ట్టియడ్డు( సిరుల॥

42. ధాతకే తెలియదు తమరిత్రావురికౌణ, యుండునో లేడో వేరొండు
జాణ। మెలగునీకనుసన్న కలుములనెరజాణ రచ్చవాయించు నారదుడు
వీణ।రామానమోస్తుతే నారాయణాయ పురాణసుప్రసాదానురూ
ప ప్రమాణ । తిమరికైనువకా రదనుజకోటులదాణ మునిలోకవిను
త యమోఘబాణ అప్రమేయముకుంద మహాప్రవీణ। వెతుకరానట్టి
చోట బెట్టితివిత్రాణ॥ సిరుల

43. నీభక్తజనగోష్ఠి నిర్వాణనిశ్రేణి దండములునీకుఁ గోదండపాణి ।
తమకోనరింతురా తపసులుపారాణి నగమార్గమములెల్ల నీపుగోణి
భూవలయంబెల్ల దేవనీతిరుగాణి తతిమిలేములబాపు తమరిరాణి ।
నీవె యేలెదవార యావత్తు మాగాణివనర నీయంఘ్రిబుట్టెనుత్రివేణి
అఖిలమెఱుగను నీకోడలైనవాణి। యింతవివరింపజేతు నీవెంతోష్టో
ణి॥ సిరుల॥

44. మదికిఅవ్వంత నీపదపద్మములచింత గలుగజేయమిమేలు గాదొకింత ।
దేబోకకరిసంబు దినదినమింతింతగతి నీవెయికదటిగానసుంత । ప్రా
పుజూపించవే నీపాదములచెంత దండమర్పింతు వేదాంతశాంత ।
పాలించవలెనన్ను పరిహరించితె వింతగాదె నీపదంబు లేదెపాంత।
కోటిరవితేజ సగుణనిర్గుణయనంత లచ్చియెఱుగును నీజాడలిచ్చ
కాంత॥ సిరుల॥

45. రక్షించుయిక లేదు రామ నీసరి నేత యెంచెతానెంతో యోచించి
ధాత । పాపనిగడుమంచినీవు యేలినదాత । నీయాజ్ఞచే వీచునీటి
తాత । చిత్తమునన్నేమి జేతువో తర్వాత దలతునిన్నెపుడు సీతా
సమేత । మిన్నకగను చుండునిన్ను మనోజేత । నీవు టుంబినిగదా
లోకమాత । కోరిమ్రొక్కెద త్రిజగదాధార భూత । అనుప
మానంద చిరసనాతనయతీత॥ సిరు॥

46. కడుమాయపెజ్జాలి బడజేసెగా రిత్త తెలిసితె పాంచభౌతికపు
చెత్త నీమహాత్మ్యత వింతనిత్య నిత్యము క్రొత్త కానితివొలచ్చి జవ్వ
నముగుత్త కాంచనాంబర ధారఘనకృపాహిత చిత్తమైన మాత్ర
మది మితంపుసత్త [illegible]రహారాజ చిత్తాపచిత్తరుపెత్త పుడమితే
డొందు నిన్నోబ్లలు[illegible]। నిజమునీకథయమృతంపు నిండుదుత్త । పతన
నినుజేయువాని పాపంబులుత్త ॥సిరు॥

47. రవిశతకోటితో రముగదా నీకాంతి। జెలగినా నిగమాళిచే వదంతి।
మెలగు నీయురమందువే ల్సంపదలబంతి నిగమార్థ సంధాయి
నీపదంతి । నీపాదతీర్థంబు నిఖిలదుష్కృతహంతి నీదాసతతి గోష్ఠి
నిఖిల శాంతి।కుక్షిలోభువనముల్ గుదిరించితివిదొంతి మునివరుల్ నిను
జూచి కానిరి భ్రాంతి, తేజముల నీను మేలు నీవైజయంతి । వైభవ
ములకు పుట్టిల్లునీభవంతి । సిరుల్క॥

53\. అనుపమాకారాచ్యుతానంతగోవింద వాసవార్చిత మాధవాము
కుంద మహితనిరంజ నామహదద్భుతానంద । విదిత నమోస్తుతే
విశ్వతుంద । వందారువందారు వందితముని బృంద । ఆర్తపోష
కసపదారవింద । చేమోడ్చునినన్ను పేగువ్యాకులమొంద ముఖ్యయోత
ద్విశ్వ మూలకంద । పాహినినుడల్తు నాదు పాపములు గ్రంద
జేయుమోయయ్య గతిమాలి నాదితినింద। సిరుల॥

54\. నయభక్తమందార జయసంతతామోద లలిరాజయోగ లీలావినోద
ఘనదయానిధి వంద్రుడనను గావనని కౌద కరుణనీకంత నాకౌరకె
రాదమాదృశభవయుక్తమతులబోవగ లేదతలచి తెపక్షపాతంబు గాద
అఘమెంత దైనసిన్ ననుసరించితె బోద వాద్యమా నీకిదిసుప్ర
సాద। పెక్కుదండంబులిడెదని పేరుమీద । అనుకోమ్మికగాదుపా
ప్మనసు మాద॥ సిరుల॥

55\. నతిజేయయనఘసంతతిదక్కనియొద్ద । ఘనపాతకుల నేల ననుటకద్ద ।
దరిలేని నాబోంట్లకరుణించగావద్ద । రామదయాసిఘే తామసుద్ద ॥
తమరుదప్పవేరొండు తప్పుచక్కగదిద్ద । విడకగీర్తించు నిన్వేల్పు
పెద్ద । ముదిజేయజేతులిముల్లోకములముద్ద । వసుధపైనినుగొల్చువాడు
నిద్ద । తొల్లినినుప్రోయనోచెనా బొల్లిగద్ద । ఆర్తులనుబ్రోవ । నీవు
బల్లైనపద్ద। సిరుల॥

56\. తమకమార్పడెడి పాతకము లేదనిపించు । సరిలేనిఘనదయాకరుడ
వెందు ।ననుగావ కౌలయాపనమేల జేశొందు।పాలింతువనిమది బాయ
కుందు । మరచియాశ్రితకోటి జెఱచితి వేముందు । రామనాభాగ్యంబు
కేమనందు । రుచిగలనిపేరు రోగంబులకుమందు ॥ సాటియానది
గాదెబల్ఘసందు । ఘనులచేబల్కబడు ప్రతిదినమునందు। నిగమములు
జేయు నుతులన్ని నిన్నె జెందు॥ సిరుల॥

57\. ఇంద్రాదివైభవం బిప్పించుమన లేదు । మహిమకై వేడినమాటగాదు।
భవరోగవైద్య సంపాద్యుండవగు నాదు । ఘనరోగమిదెమాన్ప
గాదువాదు । ఏలికవీవుండ నెవరివేడగబోదు । నీవాడనేలూరో నింద
రాదు । నిఖిలమేఘాలికి నీపాదములెపాదు । రాజితమహారాజరాజ
వాదు । స్వామినీసేవభవములజావమోదు । యొడయమ్రొక్కితిజేసు
నన్నొంటిచేదు॥ సిరుల॥

58. పాలించు కోలయాపన మింక జేసెద్దు । వారించవే పగవారి జిద్దు । నిఖి
లలోకంబెల్ల నీదెపో సరిహద్దు । మ్రొక్కితినిదె నన్ను చక్కదిద్దు ।
వినవింతయా భక్త జనులపై నీముద్దు । గాంచునానిను రెండు కాళ్ళ
యొద్దు । నిఖిలాద్భుతంబులు నీమాయ నగురద్దు లీల నిదికజేయ నేల
సద్దు । కల్లగాదెంతో నీయందు కరుణగద్దు । దండమర్పింతు నాపై
పదంబులద్దు॥ సిరుల॥

59. భువనమోహననీదు భుజపరాక్రంబెన్న ఘనులకే సాధ్యంబు గాదురన్న ।
కరుణాంబునిధివి నిక్కంబు నీవనివిన్న । వంచింపబోకు యాచించి
యున్న । ఘనభవరోగసంకటముల గైకొన్న । పాహి నన్గావు నీబం
టనన్న । సేవించెదను నిరసించి చేయకుచిన్న । దయనేలవే దైవత
ములమిన్న । దాపు లేదన్న తమరి పాదములకన్న । పెక్కులను నేర
దండమర్పించుచున్న॥ సిరుల॥

60. నాకలోకమునీకు తీవుదివాణఖాన । నిగమపదార్థంబు నీఖజాన ।
యెన్నశక్యముగాదు రన్న నీకోఖాణాన । నిత్యంబు హెచ్చరా నీఘు
రాన । సనకాదిమునులకో సంగితౌరోజీన । యెఱుగ తేడింత నిన్నిది
వాన । యిచ్ఛతో నన్ను నీకిచ్చితినజరాన । పడదోయకయ్య నన్నంది
ఖాన । నైజవిభవం ప్రపుట్టిల్లె నీజనాన । స్పష్టముకిచ్చు తగుహిసా
ఖ్యాతియాన॥ సిరుల॥

61. కలుషమెంచక నీవెకరుణించవలెగాని నిన్నెఱింగి నుతించ నేరఫూని ।
నిఖిలమే లెదవెట్లు నీకిది ఘనమేని । మన్నించుమికనుండ నిన్నుమాని ।
కంచునిపాలించ నెంచవే దయలేని । వాడవాననుగూర్చి వసుధలోని ।
మహనీయమైన నీమర్యాదబోనూని । రద్దిపాలాడువే రాజమాని ।
ఘనతకాదిది నీకింత కరుణరాని । రామశృంగారవైకుంఠ రాజధాని॥
సిరుల॥

62. ఏమి నేమనరాను యెఱిగినంతమనిన్ను । వేదంబు లేపల్క లేదుమున్ను
తమపదోద్భవగంగ భవకోటులనుదున్ను । కుటిలులనమాయ గూల
దన్ను । అఱుదుయా నిన్నెన్న నజహరాదులకున్ను మహిమ నీచేసెల్చె
మన్నుమిన్ను । నేరరాదేరికి నిజమైన నీతెన్ను । చింతింతు నీసేవ జేర్చు
నన్ను । మోదమెంతననౌరౌర । నీదుచెన్ను । నేటిభక్తులపాలి తం
గేటిజున్ను॥ సిరుల॥

63. పంచేంద్రియంబుల వంచించగా లేను । మదినిల్పుతరిజాడ మొదలుకాను
సంతతంబాత్మ విచారశక్తుడగాను । చేటుకైపాపముల్ జేసినాను ।
అనుకోదగని మహాపరాధిని నేను । చేమోద్ధు నేపైన జేయబూను ।
వంచించి తేనిని వాడగానన బోను । యెటుజొత్తు నికగతి నీవెదిన్న
పెక్కులన సేరని పేరు పెట్టిమాను । పరగనీమీద భక్తిసంపదలనిను॥సి।

64. నాపాలి భవరోగ మాపియెంతన జెప్ప । దయ నేలవైతి రత్నాలమప్ప॥
దోషిని యెవ్వరు పోషింతురోయప్ప । నిత్యదయాకర నీవుదప్ప ।
భక్తాభిమానన పాలించునది గొప్ప । శరణుగావమికి దేవరకు మెప్ప ।
కరుణించుటకు నొండొరుల వేడగనొప్ప । కఠినంబు జేయ కరిగణము
చెప్ప । బంటనోయయ్య కంటికి దంట కెప్ప । రీతిపోషించు సీతా
సమేతతప్ప॥ సిరుల॥

65. యతితతుల్ శ్రుతుల సంస్తుతులు నీపై గుప్పి మతిగొల్తురెపుడు కామముల
జెప్పి । అడలించె నవివేకమాత్మపైపైగప్పి దొలగితింకెట్లు నిన్ద్రొవ
దప్పి । విదితమెవ్వరికి నెవ్వరది నిల్వమిక నొప్పి గావవే వైరివర్గముల
ద్రొప్పి । నీవె దిక్కనుచున్న నీకు నామొఱ జెప్పి మానపుచ్చకుము
నీమోము ద్రిప్పి । కథలు నీ పేర లేనట్టి కవిత పిప్పి । రామ నిన్దల్వమికి
జెప్పరాని ప్పుప్పి । సిరుల।

66. దాయాదులందున జ్ఞేయము తలపంపు పేరాసగొన్న నీ పేరు పెంపు ।
మునిలోకవినుత యమోఘంపు నీ తెంపు ధాతకే తెలియదు నీ తలంపు ।
కరమర్థి గొల్చు నిన్నడు దేవతల గుంపు వెతల నీ పేరెంతో వెదకిచంపు ।
అగుగాదనన్ రాదు జగమంత నీపంపు లలితభవన్నుతి భవలతల డెంపు ।
అర్థినిన్గొల్చు జనులకెంతైన యింపు । కరుణ దాసుల బ్రోవ దేవరకు
సొంపు । సిరుల॥

67. అనుకోపనేమి యీయాత్మ నిమ్మల్లాపు పాటించనివ్వాదు బల్ హాకీపు।
పరికింపమిగులదుస్తరము సహాల్కాపు నిన్ను దెవ్వడో నీకు బల్ షకీపు।
తెలిసితే మేల్ సంతతంబు నతారీపు పరమార్థమార నిబారీయాపు।
మధుసూదనాముదాం మదికిదే తష్రీపు భజియింపమికి బరాబరు
ఖిలాపు। బల్క నేరదు నిన్ను వీడ్కొల్కనీపు। సుకృతనుత జేయుమయ్యా
ఖుసూరుమాఫు। సిరుల॥

68. పన్నగాధిపతల్ప మన్నించు నాతప్పు దయదెల్పవేయింత తమరిచొప్పు ।
బతిమాలి మ్రొక్కు దీభవరోగమిక ద్రిప్పు బడజేసు వైరి దోర్బలుల
జెప్పు । పాపాటవులగాల్చు భవదాఖ్యయను నిప్పుపదిగి నిన్గొల్వ నా
మదికిజెప్పు । చేజేతయెటులైన జేసుకో నీకొప్పు నగుగాక నీకది
తగనియొప్పు । ఆర్యులకు లేదు యిదివరకైన ముప్పు । వారు నిన్గొల్చి
తేర్చుకున్నారు యప్పు । సిరుల॥

69. చాలవేడిన జేయవేలకో దర్యాప్తు అత్మవై యవివేకమనుట జప్పు । గా
వించి వైరివర్గముల జేసె గిరప్తు । చెవిజేర్చుమయ్యా అజీజ్ గుప్తు
సన్నుతిచేదల్తు నిన్నురక్షారప్తు జేసి హరీఫులచేత కప్తు । తలుపకూనె
లెక్కింప తమతౌరుబల్ శిప్తు ధాత నీమాయాకృతంపు బాప్తు । అ
ద్భుతంబెంత జెప్ప షిఖాదైనతాప్తు బొంకుగాదింత నినుతిబోదు ముప్తు ।
సిరుల॥

70. మెచ్చి విభీషణు కిచ్చినయభయంబు కాకాసురుని నేలు కనికరంబు ।
కరిరాజు బ్రోచు చక్కనిదయాళుత్వంబు ప్రహ్లాదుగాచిన పౌరుషం
బు । ఇల ద్రౌపదికిక్షోక లిచ్చుమహాత్మ్యంబు మునులపాలించితివను
నిజంబు । శరణంటె బ్రోచెటి బిరుదున్నశపథంబు సర్వేశుడైన నీసా
ర్థకంబు । చక్కగానన్ను బ్రోచితె నిక్కువంబు । చాలబ్రోవమిదోచదే
సంశయంబు । సిరుల॥

71. నిఖిలవిశ్వంబంత నీవు బన్నిన డబ్బు తగుర నీమాయాకృతంపు మబ్బు ।
అజహరాదులనైన గజిబిజిగారుబ్బు నినుతి భవముల నిల్గ ద్రొబ్బు ।
రామ నిన్నెఱుగువారలకు మోక్షంబబ్బు భక్తాళి నినుగూర్చి ప్రబలియు
బ్బు । భవదన్యమైన వైభవశతంబులు జబ్బు నతిజేతు నా భవలతల ఛ
బ్బు ॥ తమనుతులులేని కథలన్ని డబ్బుడుబ్బు భవదనుగ్రహమున శుభ
ప్రదము ప్రబ్బు । సిరుల॥

72. నేడుకోలేదు నిన్నేడు బ్రోవు గరీబునెమ్మితో జేతునైకొమ్మదాబు ।
ఘను తెలుంగుదురింతె నినుగొల్చు తక్కువ నిరతంబు నెఱిజబర్దుబాబు ।
మేదిని గలవింత నీది హమాం బాబు తుదలేదు నిజమిఁక తూలజకీబు ।
కరమర్ధిమించె నీకరుణచే అఫ్తాబు ఆర్తినివారించు మన్నకీబు । ఊహ
నిన్నెన్నజాల నే నేహిసాబు । బల్కనేరదు నిన్నెవడొ బల్షిరాబు ।
సిరుల॥

73. జానకిం బ్రోవవే సకలసద్గుణధామ నారాయణా కరుణాలలామ । మెప్పు జయించు కౌశిల్యాచి పరమపావననామ రక్షించవేలనో రామరామ । నీలమేఘశ్యామ నిఖిలశాస్త్రవర్ధిమ చాటి మ్రొక్కెద నిన్ను సార్వభౌమ । నిర్వాణదాయక నిఖిలయోగక్షేమ దయజేయుమెంతో నిన్దల నమ్రేమ । పలుకవేమి నతమయ్యె కలిమి లేమ । పొగడతరమా నిన్ను సంపూర్ణకామ । సిరుల॥

74. గతిని వె పతిని వె ఖగకులరాడ్గామి నీవాడనేకదా బ్రోవవేమి । రక్షించమంకి నీవు రాదటో బదునామివేడ నేనెంతటివాడసామి ! నీవు భక్తుల యెన్నిక లేమ పోరాని బాపవే నాదుబాపంపు లేమి । నిగమగోచరతకార నీదివ్యరథనేమి ఈడు నీసరియిక లేడు భూమి । మ్రొక్కె నిన్నుడజాలడు మోక్షకామినిత్యుడౌ నెవ్వడైనను నిన్ను నోమి । సిరుల॥

75. మిన్నయిన్నిటికంటె నిన్ను బాయనినోము ముద్దుగాపవళింతె పెద్దపాము । పై భళీభళి నాదు భవముదీరగ బాము తగువింతనీవు రత్నాలగీము నీదాస జనులపై నీవుమేల్ మేయము అమిత సత్తామాత్రలయ్యాతాము । వినుతిజేజాలునిన్దన దిన మొర జాముదొరలౌక చూపొక తూరిమోము । రామనినుగొల్చు ఘనునకు రాదుగాము తూగ లేడెంతవాడు నితోటి సాము । సిరుల॥

76. కొడాయెనా నేడు నీవు వీడుగులాము జేసెదనీవురాంజీసలాము । క్రంగ జేకయ్యె ఖిల్యాల్ గరీబు ముదాము చిత్తగింతురు హాఖీఖత్తమాము । యిలబలాబర్ చలాయించునీ అహాకాము నిజభక్తజనులందు నీమఖాము । తమరాయగొని సేయుధాత హర్ హర్యాము భవునక ప్పైను బరాబరయినాము ॥ కడకుదొలగించు వైరి వర్గముల భూము నీవు జేమరుగాడె బల్ నేమనాము । సిరుల ॥

77. తెలిసెటుంగగ కాదు దేవరనీమాయ యేలకో మ్రొక్కెద కాలుదోయ । అచ్యుతానన్ను యిందందుజేయకతోయ సుప్రసాదముమంచకప్రమేయ । పాల్పడజేసితా ప్రకృతికెల్ల ననూయఅర్చించగలడని న్నాత్రాయ । అదుకొమ్మింక నీకన్య నెవ్వనిడాయ అదరించెనజ్ఞానమనెటిదాయ । కరుణనీదింత లేక యీకర్మమాయస్వామి నినుగొల్వ వన్న బ్రతి కేమిసేయ । సిరుల ॥

78. దయజూడుభక్తమందారపన్నగశాయి గిలింతునిదె సతకేలుదోయి ।
నిర్వాణదాయి ఎన్నకగల్గుశీతాయి తగనిను నెపుడు నిత్యానుపాయి ।
నీకైనబల్కీను నినుపక్షిహయమాయిలీల నెనుతిమతిలేనిహాయి।యెటతే
దువిశ్వమందింత నినువరాయి యానత్తునిను మాయకళాయి । కరకని
యాజ్ఞ మొదలునిక్కుపు కసాయి రామనినుదల్వవలె పగలేమి రేయి।
సిరుల ॥

79. ఏలికవనివేడి తేమిచేసెదో సేయుసామి నన్నేలు నిదే మతేయు ।
యెల్లదీనులబ్రోతు వెందు కోతలపోయు గతిమేల పాపముల్ కడ
ద్రోయు । కడురాగతతు లాత్మన దరించినో సేయు కోరి । నిన్దల
చితె నోరమూయు । చెప్ప నేటికి బాధ లప్పుడే యెడబాయు నేర
ములన్నిటి బారదోయు।మ్రొక్కి సేవింతుని భక్తి మొలవవేయు।కరుణా
గలవాడవీవంచు కడటప్రమోయు । సిరుల ॥

80. కరుణాంబునిధివి నిక్కంబుగా నవేరశరినంబు దలపోయునాడురార।
మొఱబెట్టివేసారి ముజీపమూడ్చితిపోర తోలగనో నికీర్తి దురిత
దూర । నెమ్మి నిపదములునమ్మియుండితిధీరనమ్మిక జెరచకన్యాయ
మార । నిందనిన్ జెందనింకెందు వేడగ జేర కావలెమోహనాకార
శూర । బుధజనస్తోత్ర వేగనాబ్రోటి ఘోర। పాతకుల నేలమికియిదే
పాటిమేర । సిరుల ॥

81. అడిరయేణికరుణించునే డహో దైత్యారి వేసారబోకు వీధ్దోసకారి ।
దేవతారులతలల్ ద్రెంచుని తల్వారి కోరదు నిన్దల కోట్లమారి ॥
చీకటిగొంగబల్కీనుపెను తలారి చక్కజే జూడునన్నొక్కతూరి ।
బలిమినయనంబు బట్టించె పెడదారి అదరతి ఘనవిపినంబుజేరి । నన్ను
దెలుపగజేయవే నిన్నుగోరి అచ్యుతానంతగోవింద హరిముఃరారి ।
సిరుల ॥

82. నేరమెంచకు జేతు నికదేజోహారు యిలబోర్తువనివింటి యిన్తెహారు।
ననుగాచుకొరకై బూనకు నేడు తకరారులో ముర్తుని యాజ్ఞకై
తయారు । కలదంతనా హాఖీఖత్తుమరికి జహార్ త్వరగజేజాలు జో
తారుమారు । కరుణించవలె నేడు కదువీడునాదారు పేరాశనున్నని
పెంపుపేరు । దలచియింతటిభవనుల తలబుదారు । బాధదోలంగించు
మ్రొక్కెద బారుబారు । సిరుల ॥

93. కోతులంనినుగొల్చి చేతులెత్తి తమభాష తామొసంగిన దేకొయామనిష। పరమునీంద్రులకు నాదరణచేత దిలాషవిశ్వేతుంద మహాత్మవిగతదోష। ముక్తి సంపదలునీముంగిటి మంజూష పనికిరానిమ్మ దాసుని జిగీష। అంచితనవరత్న కాంచనయభూష అఖిలాద్భుతంబు నీదైన వేష కలుషసంహార పూర్ణశృంగారవేష సంతతము నిన్నుగనజేయు సత్యభాష॥ సిరు॥

94. దైవమానినుజూడ దయసేయవేదృష్టి దానవయ్యేదేమి తమకు నష్టి వినుతించలేడు నిన్వేడుబల్వాపిష్టి మనజేర్చునీభక్త జనులగోష్ఠి నినుగూర్చిచేతురు నిఖిలసురల్ యిష్టి। సాగు నీయాజ్ఞతో సకలసృష్టి నూరేండ్లువెతకి వేసారని న్వరమేష్టి కడకు నీకరుణచే గాంచె తుష్టి వేదవేదాంగములకెల్ల నీదెపుష్టి అర్ధిగోరితి బెట్టుమభయంపు ముష్టి॥ సిరుల॥

95. చేజేతనీకేమిజేతున జర్వేషుపటుమిదెతన్ దరోబస్తుమాషు।మిగులనీవెవుమేద్వారిగుంజాయిషు అరజేనావు నీయందుహోషు। తెలిసిజేనైతిఖదీంనుండి కోషీషుపాలైతి కటనేడు బల్నరీషు। అయితివైరులచేత నక్సర్ ఫరామూషు బాపుమాబాపురేబద్ రవీషు। మది నెఱుంగడు నిన్ను నీగమార్ మవేషుయింత నీదయమేజ్జ మాయించుబేషు। సిరు॥

96 పంచమహాపాప సంచితంబులుజేసి అలనాటి మీకథలంటె రోసి। కూమలేచ్ఛలకు జడ కులధర్మములు గోసి దగిలితి ఘావివర్తనలు బాసి। పేరాశచేనుండి పెక్కునిందలుమోసి సంచరించితి దుష్టజనుల డాసి। ఆర్యులపై ఖించి యపరాధములగూసి మదమెక్కి న్యాయధర్మములుమూసి। ఘోరగతి జెడిపదికలపోసి బోసి। ఆర్తిజెందితి నెట్లో దయాంబురాశి। సిరు॥

97. మున్నెజేసిరి ఘనుల్ నిన్నుగూర్చి తపస్సుతూగి నిన్నుడవమి దుర్వచస్సు। జిష్ణునిమించుని న్లింత్లు చేతస్సు తమకొసంగెనుసిరి తనమనస్సు। ఆవహించెను. భువి అవనితే జస్సు మలుపవే యజ్ఞానమను తమస్సు। నీయాజ్ఞచే గాక నెగడవొక్క జనస్సునాద నాద్భుతమకారవర్ధనస్సు। నిబిడమైనిండె యెడలేక నీయశస్సు। అందినిన్గొల్వ వలెనినీయంద హస్సు॥ సిరు॥

98. చిత్రమూ మంజారిజేయు నాదర్శ్యాస్తు సాదరిప్పించు నియూదు
దాస్తు । మదితోడగొను నజరినుగో దరోబస్తుదయసేయు గోల్వదగిన
శిస్తు।నిగమముల్ తమ సన్నిధిన జేయు నిషస్తుభళిగ నినడువడిబల్దురస్తు।
పరమునీంద్రులమనే వజుమ సిదేపుస్తుయిది ప్రెముక్కితిని జేయకికక
షికస్తు । మాటిగినిన్గల్డు దేమనామతికిసుస్తు।సిశసుగ్రీవు జోరారసేమ
దోస్తు॥ సిరుల॥

99. వర్ణించరాదు నెవ్వరికైన నికేళిసేనగా జేసితా వానరాళి। నిజభక్త
జనులతో సిమవింత హోళిపెలగించితివిగదా మింటహేళిలలి
జేయు కలిమితోయ్యాలి సిమనివ్వాళి చవిగొని నీ నుతిచంద్రమాళి।
నీనామనుతియె కొనిన్ను జేర్చు ప్రతోళిబరపు నాపైనికృపాప్రణాళి।
అమితవిభవప్రదాయిని యైనతాళి । గలుపు నాపాప సంచయములను
ధూళి॥ సిరుల॥

100. తెలియగోరుదు కంతోదేరినిన్ జేవళ్లు నినుతించరాదు నిన్నేయినోళ్ళు
గలశేష నమనైన కడువింతపోకళ్లు పరమార్థబోధిని పావుకోళ్ళు
కడుబాడి నినునారదుడు వైచపింపిళ్ళు దనుజులపై మహోత్తరపుతళ్లు
బతికించిసురలను గరుణించికడుత్రుళ్ళు బోడమబో జేసి తెపూటకూళ్ళు
రెంతభవమైననను దల్చినంతప్రేళ్లు।బర్వగా జేసితివి నీళ్ళపైనజాళ్ళు
సిరులకిరవైన జుంటిశ్రీ జీడిగంటి। ధామసుగుణాళి [illegible] శ్రీరామ రామ.

మంగళం. మంగళం. మంగళం.



— —